# ANDHRA SREEBHASHYA.

# ఆంధ్రశ్రీభాష్యము.



భగవద్రామానుజాచార్యులవారిచే
బోధాయనవృత్త్యనుసారముగా రచియింపఁబడిన
బ్రహ్మసూత్రభాష్యము.

హానరెబిల్ శ్రీరాజా గోడేనారాయణగజపతిరాయనింగారి

సెలవు ప్రకారము

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి అయ్యవారలుఁగారిచేఁ
దెనుఁగు సేయఁబడి

వారి సెలవు ప్రకారమె

ముద్రింపఁబడినది.

౪ సంచిక.

PUBLISHED BY

Sree Paravastu Sreenivasa Jagannadhaswami Ayyavaralugaru.

Printed by N. Subbarow at the Arsha Press.

Vizagapatam, 1890.

ప్రకాశింపుచున్నది- నేను సుఖవంతుఁడనని నట్లె నేను తెలిసికొనుచున్నానని యనుకొనును- కాఁబట్టి తనకై ప్రకాశింపుచుండుట (తెలియఁబడుచుండుట) యనెడి అజడత్వము జ్ఞానమునందు లేదు- అందువలన తన యాత్మను గూర్చి తనసత్త (ఉనికి) చేతనే సిద్ధించెడి జడము కాని అహమ్ (నేను) అనెడి శబ్దము యొక్క యర్థమె యాత్మ- జ్ఞానము తెలియఁబడునదియగుటయు నాతనితోడి సంబంధమువలన వచ్చినదే- దానింబట్టి వచ్చినదేకదా, జ్ఞానముకూడ సుఖాదులవలె తనకాధారమగు జీవునిమట్టుకు ప్రకటమగుటయు మిగిలినదానింగూర్చి ప్రకటము కాకపోవుటయును- కాఁబట్టి జ్ఞానమాత్రమె యాత్మకాదు- తెలిసికొనువాఁడై అహమ్ (నేను) అని చెప్పఁబడువాఁడె ఆత్మ-

౪౦. అనుభూతి (జ్ఞానము) పరమార్థముగా విషయము లేనిదియు నాధారము లేనిదియు నగుచు భ్రాంతిచేత జ్ఞాత (తెలిసికొనువాఁడు) గాఁ దోఁచుచున్నది, ముత్తెపుచిప్ప వెండిగాఁ దోఁచునట్లె, ఆధారము లేని భ్రమము సందర్భింపదుగదా, అని చెప్పినది యుక్తముకాదు- అట్లయినచో నెదుట నుండెడి కాంతిగల ద్రవ్యముగా వెండి మొదలగునవి తెలియఁబడునట్లె, అనుభూతి (జ్ఞానము) నేనే అని, అనుభవించువాఁడను అనుభూతి సామానాధికరణ్యమున (అనుభూతిశబ్దమును అహమ్ అను శబ్దమును విశేషణవిశేష్యములగునట్లు) తోఁచవలయును- పరిష్కృతముననో వేఱుగాఁ దోఁచుచుండెడి యీ యనుభూతి (జ్ఞానము) అహమ్ (నేను) అను శబ్దమున కర్థమగువానికి విశేషణము (ధర్మము) అగుచున్నది- దండము కలవాఁడు దేవదత్తుఁడు అనునప్పుడు దండము దేవదత్తునకు విశేషణమగునట్లె- నేను అనుభవింపుచున్నాను అని యొకదా తోఁచుట- ఇట్లు అస్మదర్థమును (నేను అను దానిని) అనుభూతితోఁగూడినదానిగాఁ దెలియఁజేయుచుండెడి నేను అనుభవింపుచున్నాను అనెడి జ్ఞానము, దండముకలవాఁడు దేవదత్తుఁడు అనెడి జ్ఞానము దండమును మాత్రమె యవలంబించుననునట్లు, విశేషణమగు జ్ఞానమును మాత్రమె యవలంబించియున్నదని యెట్లు సాధింపఁబడును?

౪౧. నేను స్థూలమైనవాఁడను అని యిట్లు దేహమె ఆత్మ యనెడి యభిమానము (భ్రమము) కలిగినవాఁడె జ్ఞాత (తెలిసికొనువాఁడు)

గాఁదెలియఁబడుటను జ్ఞాతృత్వముకూడ అసత్యమె అనిచెప్పుటయు క్తముకాదు- అట్లైనచో ఆత్మగాఁదెలియఁబడిన యనుభవమునకుఁ గూడమిథ్యాత్వము (అసత్యత్వము) తటస్థించును- అదియును దేహాత్మాభి మానముకలవానికె తెలియఁబడుచున్నది- మిగిలినవానినన్నిటి నింబోఁగొట్టెడితత్త్వజ్ఞానముచే బాధింపఁబడదుగాన ననుభూతి (జ్ఞానము) అసత్యముకాదు, అందువేని, ఇట్లేజ్ఞాతృత్వము (తెలిసికొనువాఁడగుట) గూడనసత్యముకాదు.

౮౨. వికారములులేనియాత్మకు జ్ఞానమనెడిక్రియకు కర్తయగుటయనెడి జ్ఞాతృత్వము (తెలిసికొను వాఁడగుట) సంభవింపదు, ఇందువలన జ్ఞాతృత్వ మువికారస్వరూపమైనదిగాన జడమై వికారములకు స్థానమై అవ్యక్తపరిణామమైన(ప్రకృతివికారమైన) యహంకారమనెడి ముడియందున్నది గాన నాత్మకు జ్ఞాతృత్వములేదు, ఇఁకనేమన్నను,—అంతఃకరణరూపమైనయహంకారమునకె, జ్ఞాతృత్వము కర్తృత్వము మొదలగునవిరూపము(రంగు)మొదలగు వానివలె తెలియఁబడువానిధర్మములు, ఆత్మకర్తయనియు అహమ్(నేను)అనెడి జ్ఞానముచేఁదెలియఁబడుననియు నంగీకరించినయెడను దేహమువలె ఆత్మకాకపోవుటయు పరాక్కు-(మఱియొకదానికి తెలియఁబడునది)అగుటయును జడమగుటయును ప్రసక్తించును, అనిచెప్పినదియును యుక్తముకాదు- అంతఃకరణరూపమైన యహంకారము, దేహమువలెనే యచేతనంబును ప్రకృతి పరిణామంబును దృశ్యంబును (తెలియఁబడునదియు) పరాక్కును పరార్థంబు (మఱియొకనికొఱకైనదియు)నయినది- జ్ఞాతృత్వము(తెలిసికొనువాఁడగుట) అనునది చేతనునకుఅసాధారణమైన (మఱియొకదానియందుండక వానియందు మాత్రమెయుండునదియైన)స్వభావము(ధర్మము)-

౮౩. ఫలితార్థము- దేహము మొదలగునదిదృశ్యత్వము (తెలియఁబడుట)పరాక్త్వము(మఱియొకదానికితెలియుట)మొదలగుహేతువులచేత వానికివిరుద్ధములైన ద్రష్టృత్వము(తెలిసికొనువాఁడగుట)ప్రత్యక్త్వము (తనకుతాను తెలియుట)మొదలగు వానినుండి ఎట్లు భేదింపుచున్నదో, ఇట్లు, అంతః కరణరూపమైన అహంకారముగూ

డ ఆద్రవ్యమెయగుటను ఆహేతువులచేతనె ఆధర్మములనుండి భేదింపుచున్నది- ఈవిరోధమువల్లనే అహంకారమునకు జ్ఞాతృత్వము (తెలిసికొనువాఁడగుట) లేదు- జ్ఞానమగుటలేనియట్లె - జ్ఞానమగుట అజ్ఞానమునకు కర్మమైన యహంకారమునకెట్లు లేదో, అట్లె జ్ఞాతృత్వము (తెలిసికొనువాఁడగుట) కూడ అజ్ఞానమునకు కర్మమైనదానికి అంగీకరింపఁబడఁగూడదు- జ్ఞాతృత్వము వికారాత్మకమైనది కాదు- జ్ఞాతృత్వమనఁగా జ్ఞానమనెడి గుణమునకు ఆధారమగుట- జ్ఞానము గూడ నిత్యుఁడైన వీనికి స్వభావసిద్ధమైన ధర్మముగాన నిత్యము- ఆత్మ నిత్యమగుట (॥౨॥౩॥౧౮॥) నాత్మా శ్రుతేః ఇత్యాదిసూత్రములలోఁ జెప్పఁబడును- (॥౨॥౩॥౧౯॥) జ్ఞోఽత ఏవ అను సూత్రమున జ్ఞః (తెలిసికొనువాఁడు) అని చెప్పుట చేత జ్ఞానమునకాధారమగుటగూడ స్వాభావికమని చెప్పఁబడఁగలదు- ఈతఁడు జ్ఞానస్వరూపుఁడైయుండియె, రత్నము మొదలగునవి కాంతికి ఆధారమగునట్లు, జ్ఞానమునకు ఆధారమగుట విరుద్ధము కాదని చెప్పఁబడినదిగదా- స్వయముగా పరిచ్ఛేదము లేనిదే యైన జ్ఞానము, సంకోచమునకును (తగ్గుటకును) వికాసమునకును (విరివియగుటకును) తగినదని నిరూపించెదము- కాఁబట్టి క్షేత్రజ్ఞావస్థ (సంసారియై యున్నస్థితి) యందు కర్మముచేత సంకోచించిన స్వరూపము కలదై వానివాని కర్మములకు తగినట్లు తారతమ్యముగా నుండును- ఇంద్రియముల ద్వారముననే ప్రసరించును- ఇట్లు ఇంద్రియద్వారమున ప్రసరించుటను బట్టియె, జ్ఞానము కలుగుచున్నది, జ్ఞానము పోయినది, అనెడి వ్యవహారము ప్రవర్తించుచున్నది- ఇట్లు జ్ఞానము ప్రసరించుటయనెడి వికారము జీవునకుఁగలదు- అది స్వాభావికము కాదు- మఱియేమన్నను, కర్మము వలన వచ్చినది, కావున నాత్మ వికారము లేని స్వరూపము కలవాఁడె- ఇట్టి వికారమైన జ్ఞాతృత్వము జ్ఞానస్వరూపుఁడైన యాత్మకె కాని నొకప్పుడును జడమైన యహంకారమునకు జ్ఞాతృత్వము సంభవించుట లేదు-

౭౩. అహంకారము జడస్వరూపమైనను దానికి సన్నిధానము చేత (జ్ఞానసంపర్కము చేత) చిచ్ఛాయాపత్తివలన జ్ఞాతృత్వము సంభవింపవచ్చును, అనియందురేని, చిచ్ఛాయాపత్తి యనఁగా నేమి? అ

హంకారచ్ఛాయాపత్తి జ్ఞానమునకా, లేక జ్ఞానచ్ఛాయాపత్తి అహం
కారమునకా? అహంకారమునకు జ్ఞానచ్ఛాయాపత్తియనఁగూడదు- ఎం
దువల్లనంటేని, జడమైన జ్ఞానమునకు జ్ఞాతృత్వమును మీరంగీకరింప
లేదు- జ్ఞానమునకు అహంకారచ్ఛాయాపత్తియనియును అనఁగూడదు-
ఎందువల్లనంటేని వెనుకఁజెప్పినచొప్పున యాయహంకారమునకు జ్ఞాతృ
త్వము కరిపడదు- ఇంతియె కాక రెండును కంటికి కనఁబడనివి- కంటికిక
నఁబడనివానికి ఛాయ(నీడ) కనుబడుట లేదు-

౭౫. ఇఁకను అగ్నిసంపర్కమువలన ఇనుపముక్కకు వేడికలిగి
నట్లు జ్ఞానసంపర్కమువలన జ్ఞాతృత్వము తెలియఁబడుచున్నది,
అనియందురు- అదియును సరికాదు- జ్ఞానమునందు వాస్తవమైనజ్ఞాతృ
త్వమును మీరు అంగీకరింపలేదు గాన దానిసంపర్కమును పట్టి అహంకా
రమున జ్ఞాతృత్వమైనను జ్ఞాతృత్వము తెలియఁబడుటయైనను ఎట్లు
కలుగును? అచేతనమైన యహంకారమునకు జ్ఞాతృత్వమె సంభవింప
దుగాన బొత్తిగా దానిసంపర్కమును పట్టి జ్ఞానమునందు జ్ఞాతృ
త్వమైనను జ్ఞాతృత్వము కనఁబడుటయైనను కుదురదు-

౭౬. వాస్తవముగా రెండిటియందును జ్ఞాతృత్వము లేదు, అ
హంకారము జ్ఞానమునకు అద్దము మొదలగునదివలె అభివ్యంజ
కమై జ్ఞానమును తనయందున్నదానిగానే అభివ్యంజనము చేయుచు
న్నది, అనుటయును సరికాదు- స్వయంప్రకాశుఁడైనయాత్మకు జ
డమైన యహంకారముచేత అభివ్యంజనముచేయఁబడుట యుక్తము
కాదు- ఈయంశము ఆత్మసిద్ధిలోఁ జెప్పఁబడినది-

౭౭. శ్లో॥ శాన్తాఙ్గార ఇవాదిత్యమహంకారో జడాత్మకః। స్వ
యంజ్యోతిషమాత్మానం వ్యనక్తీతి నయుక్తిమత్॥ (ఆరిపోయిననిప్పుసూ
ర్యునివలె జడస్వరూపమైన యహంకారము స్వయంప్రకాశుఁడైన
యాత్మను ప్రకాశింపఁజేయుననుట అయుక్తము- సమస్తపదార్థములు
ను స్వయంప్రకాశుఁడగువాని అనుభవమునకు అధీనమైనసిద్ధిగలవిక
దా- వానికి అధీనమైన ప్రకాశముకలదై అచిత్తైన అహంకారము, పు
ట్టుకయు నశింపకయునుండెడి స్వరూపప్రకాశముకలదియును సమ

ప్రవస్తువులును తెలియఁబడుటకు హేతువునగు అనుభవమును అభివ్యంజనము చేయును, అను దానింగూర్చి ఆత్మతత్త్వము నెఱింగినవారు పరిహసింతురు-

౪౮. ఇంతియెకాక అహంకారమునకును అనుభవమునకును స్వభావముంబట్టి విరోధముండుట వల్లనును అనుభవము అననుభూతి(అనుభవముకానిది) కావలసివచ్చుటనును వ్యంక్త్యవ్యంగ్యభావము(ఒకఁటివ్యంక్తి అనఁగా తెలియఁజేయునది యగుటయు ఒకఁటివ్యంగ్యము అనఁగా తెలియఁజేయఁబడునది యగుటయును) సరిపడదు- ఈయంశముగూడఁజెప్పఁబడినది-శ్లో॥ వ్యఙ్క్త్యవ్యఙ్గ్యత్వమన్యోన్యం నచస్యాత్ప్రాతికూల్యతః। వ్యఙ్గ్యత్వే౽ననుభూతిత్వమాత్మనిస్యాద్యథాఘటే (ఒకఁటిదానికొకటి ప్రతికూలములు అనఁగా విరుద్ధములగుటవలన పరస్పరము వ్యంక్త్య వ్యంగ్యభావము అనఁగా ఒకఁటివ్యంజకమగుటయు మఱియొకఁటివ్యంగ్యమగుటయు కుదురదు- ఆత్మవ్యంగ్యమగుటకలుగునేని ఘటమువలె జ్ఞానస్వరూపము కాకపోవుటయు తటస్థించును) సూర్యకిరణములు తమచేఁదెలియఁజేయఁబడెడి హస్తముచేతఁదెలియఁజేయఁబడుటవలె జ్ఞానముచేతఁదెలియఁజేయఁబడెడి యహంకారముచేఁదెలియఁజేయఁబడుట జ్ఞానమునకుయుక్తమె అనుటసరిపడదు- సూర్యకిరణములు హస్తముచేతఁదెలియఁజేయఁబడుటలేదు- మఱియేమన్నను- కరతలము (అఱచేయి) చేతను అడ్డగింపఁబడినవై, సూర్యకిరణములు, దట్టమై, తమంతనె మిక్కిలి స్ఫుటముగాఁదెలియఁబడుచున్నవి- కాఁబట్టి కరతలము ఆకిరణములుదట్టమగుటకు హేతువగుటమాత్రమె కాని అభివ్యంజకము(తెలియఁజేయునది)అగుటలేదు-

౪౯. ఇంతియెకాక ఈజ్ఞానస్వరూపుఁడగు నాత్మకు అహంకారముచేఁగలిగెడి అభివ్యక్తి (స్ఫుటపడుట) యెట్టిది? పుట్టుకగాదు- స్వతస్సిద్ధుఁడు (మఱియొకఁటిదానివలనఁగలుగనివాఁడు)అగుటను మఱియొకఁటిదానిచేఁబుట్టింపఁబడువాఁడుగా నంగీకరింపఁబడలేదుగదా- అతఁడుప్రకాశించుట(తెలియఁబడుట)యునుకాదు- (ఆత్మ జ్ఞానమెకదా)- జ్ఞానము మఱియొకఁజ్ఞానముచేఁదెలియఁబడుటను మీరంగీకరింపలేదుగదా- ఈహేతువుననె ఆత్మను తెలిసికొనుటకు సాధన

ములగువానికి సహాయముచేయుటయనుగాదు- ఆసహాయము రెండు విధములు- అందొకటి, తెలియవలసినదానికి ఇంద్రియములతో సంబంధముకలుగుటకు హేతువగుట- అదియెట్లన్నను,జాతిని (గోత్వము మొదలగుదానిని) గ్రహించునప్పుడు,వ్యక్తి (గోవు మొదలగునది), నేత్రము మొదలగు నింద్రియములతో జాతికిసంబంధమును కలుగఁజేయునట్లును, తనముఖమును తానుజూచికొనునప్పుడు అద్దముతనముఖమునకును తనకంటికిని సంబంధమునుకలుగఁజేయునట్లును- రెండవది తెలిసికొనువానియందుండెడికల్మషమును (పాపమును) పోఁగొట్టుట- అదియెట్లన్నను,పరతత్త్వమును తెలియఁజేసెడిశాస్త్రమునకు, శమదమాదులు, తెలిసికొనువానియందుండెడి పాపమును బోఁగొట్టి సహాయమగుట- ఈయంశము ప్రాచీనులచేఁగూడఁ జెప్పఁబడినది- శ్లో॥కరణానామభూమిత్వాన్నతత్సంబన్ధహేతుతా (ఆత్మ ఇంద్రియములకు విషయము కాదుగాన ఇంద్రియములతోడి సంబంధమునకు హేతువగుటయభివ్యక్తికాదు-)అని-

౫౦. ఇంతియెకాక జ్ఞానము తెలియఁబడునదిగా నొప్పినను, ఆ సామర్థ్యము, ఆ తెలివికిసాధనములగువానికిసహాయముచేయునని చెప్ప శక్యముకాదు- ఆసహాయము తెలియఁబడవలసిన దానితెలివిపుట్టుటకుఅడ్డములగువానిని పోఁగొట్టుటచేఁగావలయును- ఎట్లన్నను; రూపము(రంగు) మొదలగువాని తెలివిపుట్టుటకుఅడ్డమగుచీకటినిపోఁగొట్టుటచేఁగంటికిదీపము మొదలగునదిసహాయముచేయునట్లు- ఇచ్చట అట్టిది పోఁగొట్టవలసినది కనఁబడదు- జ్ఞానస్వరూపమైన యాత్మయందు ఆయాత్మనుగూర్చిన తెలివిపుట్టుటను అడ్డగించునదియునహంకారముచేఁబోఁదగినదియునగునదియెద్దియును లేదు- అజ్ఞానమున్నదేయంటిరేని, అజ్ఞానముఅహంకారముచేఁబోఁగొట్టఁబడఁదగినదిగానంగీకరింపఁబడలేదు- జ్ఞానమేకదా యజ్ఞానమునుపోఁగొట్టునది- ఇదిగాకఅజ్ఞానము జ్ఞానమునాశ్రయించియుండుటసంభవింపదు- అజ్ఞానమునకును జ్ఞానమునకును ఆశ్రయంబును (ఆధారంబును) విషయంబునొక్కటియెయగుటను, తెలిసికొనువాఁడగుటయును విషయమగుటయును లేనిజ్ఞానమాత్రమేయైన సాక్షియందు అజ్ఞానముండుట

సంభవింపదు- జ్ఞానమున కాధారమగుటకు ప్రసక్తి లేని ఘటము(కుండ) మొదలగునవి యజ్ఞానమున కాధారమగుట యెట్లు లేదో, అట్లనే జ్ఞానముకూడ జ్ఞానమునకు ఆధారమగుట లేదుగాన అజ్ఞానమున కాధారమగుటయును కూడదు- ఒకప్పుడు సంవిత్తు (తెలివి) యజ్ఞానమున కాధారమని చెప్పినను అట్లుగా నొప్పిన సంవిత్తు జ్ఞానమునకు విషయము కాదుగాన దానియందుండెడి యజ్ఞానము జ్ఞానముచే నివర్తింపదు- జ్ఞానమెప్పుడును తనవిషయమునందలి యజ్ఞానమునే పోఁగొట్టును- రజ్జువు(త్రాడు) మొదలగుదానియందు వలెనే (త్రాటిని చూచి సర్పమని భ్రాంతిపుట్టినప్పుడు ఇది త్రాడు గాని సర్పము కాదు అనెడిజ్ఞానము తనకు విషయమగు త్రాటియందుఁ గలిగిన సర్పమనెడి యజ్ఞానమును పోఁగొట్టినది)- కాఁబట్టి యొకప్పుడైనను దేనిచేతనైనను సంవిత్తు(జ్ఞానము) నాశ్రయించియుండెడి యజ్ఞానము పోఁగొట్టఁబడదు- సత్తు(ఉండునది) అని కాని అసత్తు(లేనిది) అని కాని చెప్పఁదగని యజ్ఞానముయొక్క స్వరూపమును నిరూపించుట శక్యము కాదని ముందు చెప్పఁబడఁగలదు- జ్ఞానప్రాగభావరూపమగు నజ్ఞానము, జ్ఞానముపుట్టుటకు విరోధి కాదుగాన దానిని పోఁగొట్టుటచే జ్ఞానసాధనములకెట్టి యుపకారంబును లేదు- [అభావము నాలుగు విధములు- భేదమనియును అత్యంతాభావమనియును ప్రాగభావమనియును నాశమనియును- అందు భేదమనునది కాకపోవుట- ఎట్లన్నను- గోవు(ఎద్దు) మహిషము(దున్నపోతు) కాదు- అనునప్పుడు మహిషభేదము అనఁగా దున్నపోతు కాకపోవుట ఎద్దుయందుఁ గలదు- అత్యంతాభావమనఁగా లేకపోవుట- ఎట్లన్నను- ఇచ్చట ఘటము (కుండ) లేదు- అనునప్పుడు ఘటాత్యంతాభావము అనఁగా కుండ లేకపోవుట ఈస్థలమునఁ గలదు- ఈయత్యంతాభావమును సాధారణముగా అభావమనియె వాడెదరు- ఎట్లన్నను, ఘటాభావము పటాభావము అని- ఒకవస్తువు పుట్టకముందు ఆవస్తువు పుట్టువఱకును ఆవస్తువు లేకపోవునుగాన ఆ లేకపోవుటను ప్రాగభావమనియెదరు- ఘటప్రాగభావము, పటప్రాగభావము అనియిట్లు చెప్పుదురు- ప్రకృతమున జ్ఞానప్రాగభావమనునది ఒక తెలివి పుట్టకముందు ఆ తెలివి లేకపోవుట- ఇఁక నాశమనునది ఒకవస్తు

వు చెడినపైని ఆవస్తువులేకపోవుట- ఘటనాశము పటనాశము అని యిట్లు చెప్పుదురు- ఘటధ్వంసముపటధ్వంసముఅనికూడ వ్యవహరింతురు-] కాఁబట్టి ఏప్రకారముగానును అనుభూతికి(జ్ఞానమునకు)అహంకారముచేతను అభివ్యక్తిసంభవింపదు.

౫౧. అభివ్యంగ్యమును తనయందున్నట్లు అభివ్యంజనముచేయుట అభివ్యంజకములస్వభావమనుట సరికాదు- ఎందువల్లనంటేని, దీపము మొదలగువానియందుఅట్లుకనఁబడుటలేదు- జ్ఞానఁబును దానిసాధనంబును వానికిఉపకరించునదియునుగూడ, పదార్థము ఉన్నదిఉన్నట్లు తెలియుటకుతగినస్వభావముకలవి- అదియును స్వతః ప్రామాణ్యన్యాయముచేత సిద్ధించినది- (స్వతఃప్రామాణ్యమనఁగా జ్ఞానము యథార్థమును తెలియఁజేయునదియగుటగూడ ఆజ్ఞానమునందె తెలియఁబడుట) ఇంతియెకాక అద్దముమొదలగునది ముఖముమొదలగుదానికి అభివ్యంజకమెకాదు- మఱియేమన్నను, చక్షుస్సుయొక్క తేజస్సుప్రతిఫలించుట(Reflection)యనెడిదోషమునుకలుగఁజేయును- ఆదోషమువలనఁగలిగినదేముఖముమొదలగునదితాఱుమాఱుగాఁగనఁబడుట- అభివ్యంజకమువెలుగుమొదలగునదియే-ప్రకృతముననట్లు,అహంకారముచేత, స్వయంప్రకాశమైన జ్ఞానమునందు, అట్టిదోషములుకలుగుటసంభవింపదు- వ్యక్తికిజాతి ఆకారముగాన జాతి వ్యక్తియందున్నట్లు కనఁబడునుగాని వ్యక్తికి వ్యంగ్యమగుటనుకాదు- కాఁబట్టి అంతఃకరణమైన అహంకారమందున్నట్లు జ్ఞానము తెలియఁబడుటకు, స్వభావమునఁగానీ దోషమువలనఁగానీ కారణమేదియునులేదుగాన, అహంకారమునకు జ్ఞాతృత్వమైనను అట్లుతెలియఁబడుటయైనను సంభవింపదు- కాఁబట్టి స్వయముగానె జ్ఞాతగాసిద్ధింపుచున్న అహమ్ శబ్దార్థమె ప్రత్యగాత్మ- జ్ఞానమాత్రముకాదు-అహమ్ అనిచెప్పఁబడుటలేదేని జ్ఞానమునకుఁగూడ ప్రత్యక్త్వముసిద్ధింపదు, అనిచెప్పఁబడినదిగదా-

౫౨. తమస్సనెడిగుణముచేత ఆక్రమింపఁబడుటవల్లనును పరాగర్థములయొక్క (మఱియొకఁడానిచేఁదెలియఁబడువానియొక్క) అనుభవములేకపోవుటవల్లనును అహమ్ అనెడిఅర్థము ప్రత్యేకము

గానును స్ఫుటముగానును తెలియఁబడుట లేకపోయినను మేలుకొ
నునపుడును అహమ్ (నేను) అనియొకవిధముగానే ఆత్మస్ఫురించుట
వలన నిద్రయందుఁగూడఅహమ్(నేను)అనఁబడుటతప్పదు. మీరుఅంగీక
రించిన అనుభూతికిని అట్లె ప్రసిద్ధి యనవలసియున్నది. నిద్రపోయి
లేచినవాఁడెవ్వఁడును,—అహమ్ (నేను) అనిచెప్పఁబడనిదై మిగిలి
నపదార్థములకంటె విలక్షణమైనయాకారముకలదైన జ్ఞానమైననే
ను, అజ్ఞానమునకుసాక్షిగానుంటిని—అనియీవిధమైన నిద్రాకాలమం
దలి అనుభవమును పరామర్శించుట(తలంచుట) లేదు. నిద్రపోయిలే
చినవాఁడు నేనుసుఖముగా నిద్రించితిననికదా తలంచును. ఈతలం
పుచేత అప్పుడుగూడ అహమ్(నేను)అనిచెప్పఁబడెడి ఆత్మయె సుఖ
ముకలవాఁడగుటయుజ్ఞాత(దెలిసికొనువాఁడు)అగుటయు తెలియఁబ
డుచున్నది. ఇప్పుడుసుఖముకలుగునట్లు అప్పుడు నిద్రబోతిననియె ఈ
తలంపుఅనిచెప్పందగదు. ఈతలంపు ఇట్టిస్వరూపముకలది కాకపో
వుటయె ఇందుకుహేతువు. అహమ్(నేను) అనిచెప్పఁబడెడిఆత్మఅస్థి
రుఁడుగాన అప్పటి అహమ్ శబ్దార్థము సుఖముకలవాఁడగుటను
తలంచుట సంభవింపదనఁగూడదు. ఎందుచేతనంటేని, నిద్రించుటకు
ముందు అనుభవింపఁబడిన వస్తువును నిద్రించిలేచినవాఁడు ఇదినాచే
తఁజేయఁబడినది, ఇదినాచేత ననుభవింపఁబడినది, నేనుదీనినిపలికితిని,
అనియిట్లుతలంచుచున్నాఁడు. ఇంతకాలమును నేనేమియు తెలిసికొన
కుంటినిఅనికూడతలంచుచున్నాఁడేయంటిరేని,అయిననేమి? ఏమియును
తలంపకుంటినని అన్నియు నిషేధింపఁబడినవి అంటిరేని, అట్లుకాదు.
నేనుతెలిసికొంటినిఅని అహమ్ శబ్దార్థమైన తెలిసికొనువాఁడు అ
నువర్తింపుచునేయున్నాఁడు. తెలియఁబడువానినన్నిటింగూర్చికదాయీ
నిషేధము. ఏమియుఁదెలిసికొనకుంటినను నిషేధము అన్నిటినింగూర్చి
నదయ్యెనేని మీకుఅభిమతమగు అనుభూతికూడ నిషేధింపఁబడినది కా
వలసివచ్చును. నిద్రాసమయమున అనుసంధింపఁబడుచుండెడి, అహ
మర్థమైజ్ఞాత(తెలిసికొనువాఁడు)యయినయాత్మను, అహమ్(నేను)
అనిపరామర్శించి ఏమియునెఱుంగకుంటినని ఆతనిజ్ఞానమె నిషేధింపఁ
బడుచుండఁగా ఆకాలమున నిషేధింపఁబడుచుండెడి జ్ఞానము సిద్ధిం

చుననియును, అనువర్తింపుచుండి జ్ఞాతయయిన అహమర్థము సిద్ధింపదనియును, నేనేమియు నెఱుంగకుంటిననెడి ఈపరామర్శము (తలంపు) చేత నేసాధింపఁబోవుచున్న నీవు, ఈసాధించుటను అచేతనములయెడుట జరిగింపవలసినది- నన్నుగూడ నేనెఱుంగకుంటినని అహమర్థము గూడనప్పు డనుసంధింపఁబడకపోవుట తోఁచుచున్నదేయంటిరేని, తమరు, తమయనుభవములోనుఁదమమాటలోను నుండెడి విరోధమును గూడ నెఱుంగరు- నేను నన్ను తెలిసికొనకుంటిననిగదా అనుభవంబునుమాటయును- నన్నుఅని ఏమినిషేధింపఁబడుచున్నదని శంకింతురేని, మీరడుగునదియుక్తమె- దానిం జెప్పెదము- అహమర్థమైనజ్ఞాత అనువర్తింపుచునే యుండుటను వానిస్వరూపము నిషేధింపఁబడుటలేదు- మఱియేమన్నను, మేలుకొనినసమయమున అనుసంధింపఁబడుచుండెడి వర్ణాశ్రమాదివైశిష్ట్యము(వర్ణము ఆశ్రమము మొదలగువానితోఁగూడియుండుట)అహమర్థమునకునిషేధింపఁబడుచున్నది- నేనునన్నెఱుంగకుంటినన్నప్పుడు, దానివిషయములను ఏర్పఱుపవలసియున్నది- జాగ్రదవస్థలో( మేలుకనియున్నప్పుడు) అనుసంధింపఁబడెడి జాతిమొదలగువానితోఁగూడినఅహమర్థము నన్నుఅనునంశమునకు విషయము- నిద్రావస్థయందు ప్రసిద్ధమైవిశదముగాని తనయనుభవముమాత్రముగల అహమర్థము నేనుఅనునంశమునకు విషయము- నేనిచ్చట నిద్రించియున్నవాఁడననియు నేనిట్టివాఁడననియు నన్ను నేనెఱుఁగకుంటిని అనియేకదా అనుభవప్రకారము-

౫౩. ఇంతియుకాక నిద్రయందు ఆత్మ అజ్ఞానమునకు సాక్షిగానుండుననికదామీమతము- సాక్షిత్వమనఁగా ప్రత్యక్షముగాఁదెలిసికొనువాఁడగుటయేకదా- తెలిసికొనకున్నవానికి సాక్షిత్వములేదుగదా- లోకమునందును వేదమునందునుగూడ తెలిసికొనువాఁడె సాక్షియని చెప్పఁబడునుగాని తెలివిమాత్రము సాక్షియని చెప్పఁబడదు- మహాత్ముఁయగు పాణినిగూడ (౫॥౨॥౯౧॥) సాక్షాద్ద్రష్టరి సంజ్ఞాయామ్ అనిప్రత్యక్షముగాఁదెలిసికొనువానియందె సాక్షిశబ్దము సాధించెను- ఆయీసాక్షి తెలిసికొనుచున్నానని తోఁచుచున్నవాఁడై అస్మదర్థమేకాన అప్పుడు అహమర్థము తోఁపకయుండుట ఎట్లు?- తన

తుఁదానుప్రకాశింపుచున్నప్పుడు నేనుఅనియె ప్రకాశింపుచుండును-గాన, నిద్రమొదలగు వానియందుఁగూడను ఆత్మప్రకాశింపుచున్నవాఁడై నేనుఅనియెప్రకాశింపుచున్నాఁడని సిద్ధమైనది-

౨౪. మోక్షదశయందు అహమర్థము అనువర్తింపదనుటయు యుక్తముకాదు- అట్లయినచో ఆత్మనశించుటయె మోక్షమని ప్రకారాంతమున(మఱియొకవిధమున) చెప్పఁబడినదగును- అహమర్థము ధర్మమాత్రముకాదు- అట్లయియుండినచో అదిపోయినను అవిద్యనివర్తించినప్పుడువలె స్వరూపము నిలువవచ్చును- మీదిమిక్కిలి ఆత్మయొక్కస్వరూపమే అహమర్థము- జ్ఞానముఆత్మయొక్కధర్మము- నేను తెలిసికొనుచున్నాను,జ్ఞానమునాకుఁగలిగినది, అనియిట్లు అహమర్థమునకు ధర్మముగానె జ్ఞానముతోఁచుచున్నది- ఇంతియెకాక ఎవ్వఁడు, పరమార్థమునఁగాని భ్రాంతిచేతఁగాని ఆధ్యాత్మికము మొదలగు (౪ పేజి॥౭ పేరా॥) దుఃఖములచేత దుఃఖింపుచు నేనుదుఃఖము కలవాఁడనని తలంచునో, తరువాతను, ఈదుఃఖసమూహమునంతయు మఱిపుట్టకుండునట్లు పోఁగొట్టికొని నేనుస్వస్థత కలవాఁడను ఎట్లగుదును?అని మోక్షాభిలాషకలవాఁడగునో,వాఁడెఆ మోక్షము యొక్క సాధనమునందుఁబ్రవర్తించును- మోక్షసాధనమును ఆచరించుటచేత, నేనె లేకపోదునని తలంచునేని, వీఁడు మోక్షపుజోలికిపోవఁడు- తరువాతను అధికారిలేకపోవుటను మోక్షశాస్త్రమెల్లను ప్రమాణము కాకపోవలసివచ్చును- అహమ్ అనుదానిచేతఁజూపఁబడిన ప్రకాశమాత్రము మోక్షమందునిలుచునంటిరేని, దీనిచేతనేమి ప్రయోజనము? నేనునశించినను ప్రకాశమాత్రము ఉండుననుకొని బుద్ధిపూర్వకముగాఁబనిసేయు వాఁడొకఁడైనను ప్రవర్తింపఁడుగదా- కాఁబట్టి తెలిసికొనువాఁడుగా సిద్ధింపుచున్న అహమర్థమెప్రత్యగాత్మ- అప్రత్యగాత్మ ముక్తియందుఁగూడ నేననిప్రకాశించును; తనకుఁదానే ప్రకాశించువాఁడగుటవలన; ఎవ్వఁడెవ్వఁడు తనకుఁదానె ప్రకాశించునో, వాఁడెల్ల నేననియె ప్రకాశించును; అట్లుప్రకాశించువాఁడుగా సిద్ధఉభయవాదులకును సమ్మతుఁడైన సంసారియగునాత్మయెఉదాహరణము; ఏదినేనని ప్రకాశింపదో అదితనకుఁబ్రకాశింపదు; ఇందుఘటము మొ

దలగునవి దృష్టాంతము; ఈముక్తాత్మ తనకుఁ బ్రకాశింపుచున్నాఁడు; అందువలన ముక్తుఁడు నేననియె ప్రకాశించును. నేనని ప్రకాశించుటచేత ముక్తుఁడు జ్ఞానములేనివాఁడగుటయు సంసారియగుటయు ప్రసక్తించునని శంకింపఁబనిలేదు. ఎందువల్లనంటేని:- అజ్ఞుఁడగుటయు సంసారియగుటయు మోక్షమునకు విరుద్ధములు. ఇంతియెకాకఅహమ్ (నేను) అనితోఁచుట అజ్ఞత్వాదులకు హేతువుకాదు. అజ్ఞానము స్వరూపాజ్ఞానమైనను అన్యథాజ్ఞానమైనను విపరీతజ్ఞానమైనను అయియుండవలెను. అహమ్ (నేను) అనియెఆత్మయొక్క స్వరూపము గాన, స్వరూపజ్ఞానరూపమైన అహమ్అనెడిజ్ఞానము అజ్ఞత్వమునుసంపాదింపదు. ఇఁకసంసారిత్వము నెట్లుసంపాదించును? దానికి విరోధిగాన దానినినశింపఁజేయును.

౨౨. బ్రహ్మమె అన్నిటికి నాత్మయనెడి ప్రత్యక్షముచేత అజ్ఞానమంతయు నిశ్శేషముగాఁబోయినవారైన వామదేవాదులకుఁగూడ ఆత్మానుభవముఅహమ్ (నేను) అనియె కానఁబడుచున్నది.

(బృ॥౩॥౪॥౧౦) తద్ధైతత్పశ్యన్నృషిర్వామదేవః ప్రతిపేదే, అహంమనురభవంసూర్యశ్చ (ఆయాబ్రహ్మమును జూచుచున్నవాఁడై వామదేవఋషి నేనుమనువునైతిని, నేనుసూర్యుఁడనైతిని, అని తెలిసికొనెను. అనఁగా నేనుశరీరముగాఁగలవాఁడగు భగవంతుఁడె మనువు శరీరముగాఁగలవాఁడు అనుట.)

( ) అహమేవ చవర్తామిభవిష్యామి (నేనేయున్నాను, నేనేయుండఁగలను,) ఇవిమొదలయిన శ్రుతులుకలవు.

౨౬. మిగిలినయజ్ఞానములకన్నిటికి విరోధియైనదియు సత్తు అనిమాత్రము చెప్పఁబడునదియునగు పరబ్రహ్మముయొక్క వ్యవహారంబునిట్లె (నేననియె).

(ఛా॥౬॥౩॥౨॥) హన్తాహమిమాస్తిస్రోదేవతాః (అనుప్రవిశ్య = నేనుఈమూడుదేవతలనుం బ్రవేశించి. హన్తఅనునది సంతోషమును తెలియఁజేయును)

(ఛా॥౬॥౨॥౩॥) బహుస్యాంప్రజాయేయ (అబ్రహ్మము, నేనువిస్తారముకావలయును, పుట్టవలయును, అనిసంకల్పించెను)

(ఐత॥౧॥౧॥) స ఈక్షత లోకాన్నుసృజా ఇతి (పరమాత్మ లోకములను నేను సృజింపవలయునని సంకల్పించెను)

(భగ॥౧౫అ॥౧౮శ్లో॥) యస్మాత్ క్షరమతీతోహమక్షరాదపిచోత్తమః। అతోస్మిలోకే వేదేచ ప్రథితః పురుషోత్తమః॥ (నేను ఎందువలన క్షరము అనఁగా సమస్త భూత సమూహమును అతిక్రమించితినో, అక్షరము కన్నను అనఁగా ముక్త స్వరూపము కన్నను ఉత్తముఁడనో, ఇందువలన, లోకమందును వేదమునందును పురుషోత్తముఁడనని ప్రసిద్ధుఁడనైతిని)

(భగ॥౧౦అ॥౨౦శ్లో॥) అహమాత్మా గుడాకేశ (ఓయర్జునుఁడా నేను అన్నిటికిని ఆత్మను)

(భగ॥౨అ॥౧౨శ్లో॥) నత్వేవాహం జాతునాసం (నేను ఒకప్పుడును లేకుంటినన్నమాట లేదు)

(భగ॥౭అ॥౬శ్లో॥) అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా (నేను సమస్తమైన జగత్తునకును ఉత్పత్తి కారణంబును ప్రళయకారణంబును అగుచున్నాను)

(భగ॥౧౦అ॥౮శ్లో॥) అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే (నేను అంతటికిని ఉత్పత్తి కారణము- నావలననే అంతయు ప్రవర్తింపుచున్నది-)

(భగ॥౧౨అ॥౭శ్లో॥) తేషామహం సముద్ధర్తా మృత్యు సంసారసాగరాత్ (మృత్యువుతోఁ గూడిన సంసారమనెడి సముద్రమునుండి వారలను ఉద్ధరించువాఁడను నేనె)

(భగ॥౧౪అ॥౪శ్లో॥) అహం బీజప్రదః పితా (నేను బీజమును అనఁగా విత్తనము నిచ్చెడి తండ్రిని)

(భగ॥౭అ॥౨౬శ్లో॥) వేదాహం సమతీతాని (అతిక్రమించినవానిని నేనెఱుంగుదును)

౫౭. ఇచ్చట నొకశంక కలుగును- నేను అనునదియె ఆత్మయొక్క స్వరూపమైనయెడల అహంకారమును క్షేత్రములలోఁ జేర్చి భగవంతుఁడెట్లు ఉపదేశించెను?

(భగ॥౧౩అ॥౫శ్లో॥) మహాభూతాన్యహంకారోబుద్ధిరవ్యక్తమే

వచ(మహాభూతములును, అహంకారంబును, బుద్ధియును, అవ్యక్తంబును)అని

౫౮. ఇట్లని శంకకుఉత్తరము చెప్పఁబడును- స్వరూపమునుఉపదేశించుటవల్లను అంతటను అహమ్అనియె ఆత్మనుఉపదేశించుటవల్లను, ఆత్మస్వరూపము అట్లె తెలియఁబడుటవల్లనును అహమ్అని ఇట్లె ప్రత్యగాత్మయొక్క- స్వరూపము-అవ్యక్తము(ప్రకృతి)యొక్క పరిణామవిశేషమగు నహంకారము క్షేత్రములలోఁజేరియుండుట భగవంతునిచేత నుపదేశింపఁబడినది- అది,ఆత్మకాని దేహమున అహమ్ అనెడిబుద్ధికలుగుటకు హేతువగుటచే, అహంకారము అని చెప్పఁబడుచున్నది-ఈయహంకారశబ్దమునకు అభూతతద్భావమున(అదికానిది అదియగుటయందు)చ్విప్రత్యయమును కలుగఁజేసి వ్యుత్పత్తిచేయవలయును- ఈయహంకారమెగొప్పవారలనవమానముచేయుటకు హేతువైశాస్త్రములలో గర్వమనుపేరనుతలుచుగా విడువవలసినదిగాఁజెప్పఁబడుచున్నది- కాఁబట్టి బాధకమేమియులేని నేననెడిజ్ఞానము సాక్షాత్తుగానాత్మను తెలియఁజేయునదియె- శరీరమునందుఁగలిగెడి నేననెడిజ్ఞానము అవిద్యయె(అజ్ఞానమె)- ఈయంశము మహాత్ముఁయగు పరాశరునిచేఁజెప్పఁబడినది-

(వి॥పు॥౬అం॥౭అ॥౧౦-౧౧శ్లో॥) శూ॥యతాంచాప్యవిద్యాయాస్స్వరూపంకులనన్దన। అనాత్మన్యాత్మబుద్ధిర్యా(ఓకులశ్రేష్ఠుఁడా! అవిద్యయొక్క స్వరూపమువినఁబడవలయును-ఆత్మకానిదానియందు ఆత్మయనెడి బుద్ధి యేది కలదో)-

౫౯. జ్ఞానమాత్రమె ఆత్మయైనయెడను ఆత్మకానిదానియందు ఆత్మయనెడియభిమానము(జ్ఞానము),శరీరముజ్ఞానముఅనితోఁచుటయె యైయుండవలెను- జ్ఞాత(తెలిసికొనువాఁడు)అనితోఁచుటకాఁగూడదు-కాఁబట్టి తెలిసికొనువాఁడగు అహమర్థమెయాత్మ- ఆత్మసిద్ధియందుఁగూడనిట్లుచెప్పఁబడినది-

౬౦. శ్లో॥ అతఃప్రత్యక్షసిద్ధత్వాదుక్తన్యాయాగమాన్వయాత్। అవిద్యాయోగతశ్చాత్మాజ్ఞాతాఽహమితిభాసతె॥(ఇట్లు ప్రత్యక్షసిద్ధమగుటవల్లనును, చెప్పఁబడినయుక్తులు ,ప్రమాణవచనములు,వీనిసమ

న్వయమువల్లనను, అవిద్యయనఁగా దేహాత్మాభిమానముకదఁరుటవ
ల్లనును,ఆత్మ తెలిసికొనువాఁడు-అహమ్(నేను)అనితోఁచుచున్నాఁడు-]

౬౧. శ్లో॥ దేహేన్ద్రియమనః ప్రాణధీభ్యోఽన్యోఽనన్యసాధనః। ని
త్యో వ్యాపీ ప్రతిక్షేత్రమాత్మాభిన్నస్స్వతస్సుఖీ(దేహముఇంద్రియము
లు, మనస్సు ప్రాణము,వీనికంటెనన్యుఁడును, స్వయంప్రకాశుఁడును,ని
త్యుఁడును,మిక్కిలిసూక్ష్ముఁడగుటచేఅచేతనములన్నిటియందునుప్రవే
శించువాఁడును, ప్రతిశరీరంబును భిన్నుఁడైనవాఁడును, స్వయముగా
సుఖముకలవాఁడును, ఆత్మ)

౬౨. దోషమూలమగుటను అన్యథాసిద్ధిని(గత్యంతరమును) ఊ
హింపనవకాశముకలదుగాన భేదమునన్నిటనినవలంబించియున్న ప్ర
త్యక్షము శాస్త్రముచేత బాధింపఁబడఁదగినది, అని చెప్పినయెడల,-ఆ
దోషమేదియో చెప్పవలసియున్నది- దానింబట్టికదా మీరుప్రత్యక్ష
మునకు అన్యథాసిద్ధిని చెప్పితిరి-అ నాదిగానుండెడి భేదవాసనయె దోష
మన్నచో, భేద వాసనతిమిరావలవలె వస్తువును ఉన్నది ఉన్నట్లు
కాక విపరీతముగాఁదెలియఁజేయుట మీకుమతియెచ్చటనైనందెలిసి
యున్నదా? ఈశాస్త్రవిరోధము చేతనే తెలియఁబడఁగలదంటిరేని
అన్యోన్యాశ్రయమువచ్చును- శాస్త్రమువిశేషములన్నియు లేనివస్తు
వును తెలియఁజేయునదియను నిశ్చయము కలిగినపయిని భేద వాసన
దోషమని నిశ్చయింపఁబడును- భేదవాసనదోషమని నిశ్చయింపఁబడి
నపయినిశాస్త్రమువిశేషము లెవ్వియులేనివస్తువును తెలియఁజేయు
నదియని నిశ్చయింపఁబడును, అనిఅన్యోన్యాశ్రయము- ఇంతియెకాక భే
దవాసనమూలముగాఁగలదగుటను ప్రత్యక్షము అయథార్థమైనయెడ
ను శాస్త్రముకూడ ననియెమూలముగాఁగలదిగాన అట్లె కావలసివ
చ్చును- ఇఁకను,- శాస్త్రము దోషమూలమైనను, ప్రత్యక్షముచేఁదెలి
యఁబడిన భేదములనన్నిటిని పోఁగొట్టెడి జ్ఞానమునకు హేతువగు
టనుపరముగాన (తరువాతిదిగాన)ప్రత్యక్షమునకు బాధకము, అని
యందురు- అదిసరికాదు- దోషమూలముఅని తెలిసినపయినిపరత్వము
(తరువాతిదగుట)ఏమియుంజేయఁజాలదు- త్రాటినిచూచిసర్పమనుకొ
నుటవలనభయముకలుగఁగా వీఁడుభ్రాంతుఁడని ఎఱింగినవాఁడొక్కఁ

డు ఇది సర్పముకాదు భయపడకుమని చెప్పినను భయము నివర్తించుట కానఁబడదు- శాస్త్రము దోషమూలమగుట శ్రవణసమయమునందే తెలియఁబడినది- మననము మొదలగునవి శ్రవణమువలనఁగలిగినదియు అన్ని భేదములను పోఁగొట్టునదియు నగు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము (బ్రహ్మంబును తనయాత్మయును ఒక్కటియే యనెడి జ్ఞానము) యొక్కయభ్యాసము స్వరూపముగాఁగలవె- ఇంతియేకాక, ఇది శాస్త్రము, ఇది దోషము నూహింపనవకాశము లేనిది, ప్రత్యక్షము దోషమునూహింపనవకాశముగలది, అని నీకు దేనిచేతఁ దెలిసినది? స్వతస్సిద్ధమై విశేషము లన్నియు లేని యనుభవము దీనిం దెలియఁజేయదు- అదే విషయము తెల్పియు లేనిదిగాన శాస్త్రమునుగూడ విషయీకరింపదు- ఇంద్రియములవలనఁగలిగెడి ప్రత్యక్షము దోషమూలకమగుటను విపరీతార్థము(ఒక్కవిధముగానున్న విషయమును మఱియొక్కవిధముగాఁ దెలియఁజేయునది) గానదానిచేతఁగూడఁ దెలియఁబడదు- మిగిలిన ప్రమాణములన్నియుంగూడ ఈ ప్రత్యక్షమూలముగాఁగలవియేకదా- కాఁబట్టి మీపక్షమును సాధించెడి ప్రమాణములను ఒప్పుకపోవుటవలన మీయిష్టము సిద్ధింపదు- వ్యావహారికమైన ప్రమాణప్రమేయ వ్యవహారము మాకును గలదంటిరేని,- వ్యావహారికమనఁగా నెట్టిది? ఆపాతప్రతీతి సిద్ధమై (చూచాయగాఁ దెలియఁబడినదై) యుక్తులచే విమర్శింపఁబడినచో నిట్లు నిలువనిది వ్యావహారికమంటిరేని,- దానిచేతనేమి ప్రయోజనము? ప్రమాణముగాఁ దెలియఁబడినను యుక్తులచే బాధింపఁబడుటను ప్రమాణము చేయవలసిన కార్యమును జేయదుగదా- ఒకప్పుడు ఇట్లందురు, శాస్త్రంబును ప్రత్యక్షంబునుగూడ నవిద్యామూలకములే యైనను ప్రత్యక్షము చేఁ దెలియఁబడినది శాస్త్రముచే బాధింపఁబడుట కానంబడుచున్నది, శాస్త్రముచేఁ దెలియఁబడెడి సత్తును(ఉండునదియు) అద్వితీయంబు(రెండవదిలేనిదియు) నగు బ్రహ్మము తరువాత దానిచే బాధింపఁబడుట లేదుగాన విశేషములేమియు లేని జ్ఞానమాత్రమైన బ్రహ్మమె పరమార్థము, అని- అదియుక్తము కాదు- బాధింపఁబడకపోయినను దోషమూలకమగునది పరమార్థము కాకపోవుట నిశ్చయింపఁబడును-

౬౩. <u>ఫలితార్థము- కాచము మొదలగు నేత్రదోషము లెవ్వియు</u>

లేనిపురుషులెవ్వరును చూడనిపర్వతగుహలో నివసించుచున్నవారును, త
మకుఁదిమిరదోషమున్నదని యెఱుఁగనివారును నగుకొందఱు తిమిరదోషము
గలవారలకు అందఱకును ఒక్కవిధముగానే చంద్రులు ఇద్దఱు అనెడి జ్ఞాన
ము కలుగుచున్నది- అచ్చట బాధకజ్ఞానము లేకపోయినంతమాత్రముచేత
అది అసత్యము కాకపోవుట లేదుగాన ఆజ్ఞానమునకు విషయమైన ద్విచం
ద్రత్వము (ఇద్దఱు చంద్రులు కలుగుట) గూడ అసత్యమే- అయథార్థ
జ్ఞానమగుటకు హేతువు దోషమే కదా? అట్లే బ్రహ్మజ్ఞానముగూడ
అవిద్యామూలకముగాన తనకు విషయమగు బ్రహ్మముతోఁగూడ నస
త్యమే కావలయును- ఈవిషయమున ప్రయోగములు (ప్రసంగతర్కము
లు) గూడఁ గలవు- వివాదాస్పదమైన బ్రహ్మము అసత్యము; అవిద్యగల
వానికి పుట్టిన జ్ఞానమునకు విషయమగుటను; ప్రపంచమువలెనే- బ్ర
హ్మము అసత్యము; జ్ఞానమునకు విషయమగుటవలన; ప్రపంచము
వలెనే- బ్రహ్మము అసత్యము; అసత్యమైన హేతువువలనఁ గలిగిన జ్ఞా
నమునకు విషయమగుటను; ప్రపంచమువలెనే-

౭౪- స్వప్నమునందలి యేనుఁగు మొదలగువాని జ్ఞానము అ
సత్యమైనను సత్యమైన శుభాశుభజ్ఞానమునకు హేతువగునట్లు అవి
ద్యామూలకమగుటచే నసత్యమైన శాస్త్రముగూడ పరమార్థమైన
బ్రహ్మమును గురించిన జ్ఞానమునకు హేతువగుట విరుద్ధము కాదు
అని చెప్పఁగూడదు- ఎందువల్లనంటేని, స్వప్నమునందలి జ్ఞానము అ
సత్యము కాదు- అందు విషయములకే కదా మిథ్యాత్వము- వానికే కాని
జ్ఞానమునకు బాధకనఁబడుట లేదుగదా- నేను స్వప్నవేళను అనుభ
వించిన జ్ఞానముగూడ లేదని యెవ్వనికైనం దోఁచుట లేదుగదా- జ్ఞానమ
యితేనున్నది, అర్థములు లేవు, అనికదా బాధకజ్ఞానము- మాయఁ
జేయువానియొక్క మంత్రౌషధములవలనఁ గలిగిన మాయామయజ్ఞా
నముగూడ సత్యమైయే ప్రీతికిని భయమునకును హేతువగుచున్నది- అ
చ్చట జ్ఞానముగూడ బాధింపఁబడలేదు- విషయములు ఇంద్రియములు
మొదలగువాని దోషమువలన గలిగిన త్రాడు మొదలగు వానియందలి
సర్పాది జ్ఞానము సత్యమైయే భయము మొదలగు దానికి హేతు
వగుచున్నది- తాను కలవఁబడకపోయినను సర్పము దగ్గఱనుండుటవల

న తానుకల్పింపఁబడినట్లు కనఁబడెడి జ్ఞానము సత్యమైనదే- మరణము నకు కారణమైన శంకావిషజ్ఞానముగూడ సత్యమైనదే- వాస్తవమై న జలామలయందు ముఖము మొదలగునది కనఁబడుటగూడవాస్తవము గా ముఖమునందుండెడి విశేషమును నిశ్చయించుటకు హేతువైనదే- ఈజ్ఞానములు పుట్టుకకలవగుటయును కార్యకరములగుటయును సత్యత్వ ము నిశ్చయింపఁబడుచున్నది- ఏనుఁగు మొదలగునవి లేనియప్పుడు వానిజ్ఞానములుమాత్రము సత్యమగుటయెట్లు?, అంటిరేని, అదియు క్తముకాదు- జ్ఞానములకు విషయముకలిగియుండుట మాత్రమెకా వలసినది- వస్తువు తెలియఁబడుటయె విషయమగుటకు కావలసిన ది- ప్రకృతమున దోషవశమువల్ల తెలియఁబడుట(స్ఫురించుట) కలి గియెయున్నది- అది(విషయము)బాధింపఁబడినదిగాన అసత్యమని ని శ్చయింపఁబడుచున్నది- బుద్ధిబాధింపఁబడలేదుగాన సత్యమెయని చె ప్పఁబడినది-

౬౫. రేఖచేత(లిపిచేత)వర్ణములను తెలిసికొనునప్పుడుగూడఅ సత్యమునుపట్టి సత్యమును తెలిసికొనుటలేదు- ఎందుచేతనంటేని, రేఖ సత్యమె- వర్ణస్వరూపముగాఁదెలియఁబడిన రేఖగదా వర్ణజ్ఞానమున కు హేతువు, వర్ణస్వరూపమగుట యసత్యముగాదా యంటిరేని, అ ట్లుకాదు- అసత్యమైన వర్ణస్వరూపత్వము ఇచ్చట నుపాయమ గుటలేదు- లేనిదియు తెలియఁబడనిదియును ఉపాయమగుట కనఁబడ దు-ఉపపన్నముసయితముగాదు-ఇఁకనుఅరేఖయందలివర్ణజ్ఞానముకా రణమన్నను, అసత్యమునుపట్టి సత్యజ్ఞానములేదు- వర్ణజ్ఞానముస త్యమెకదా- ఇదికాక ఉపాయంబును (సాధనంబును) ఉపేయంబును (సాధ్యంబును)ఒకటియే కావలసివచ్చును- రెండునువర్ణజ్ఞానము లగుటలో విశేషములేదుగదా- రేఖతనయందులేని వర్ణస్వరూప ముచేతనే ఉపాయమగునెడల ఒకటేరేఖయె తనయందులేని అన్ని వర్ణముల స్వరూపమగుట సులభముగాన, ఒకటేరేఖను చూచినతో డనే అన్నివర్ణంబుల జ్ఞానమును కలుగవలయును- ఇఁకనుఒకొక్క శరీరమందు దేవదత్తుఁడు మొదలగుసంకేతములను చేసినట్లు కంటి చేగ్రహింపఁదగిన ఒకొక్కరేఖయందు చెవిచేతగ్రహింపఁదగిన ఒ

కొండకొండవర్ణముయొక్క సంకేతమును బట్టి ఒకొండొకరేఖ ఒకొండొకవర్ణజ్ఞానమునకు హేతువగునంటిరేని, సరియె- అప్పుడు సత్యమైన దానివలననే సత్యజ్ఞానము కలిగినది- రేఖయును సంకేతంబును సత్యముకదా- రేఖాగవయమును (గొఱపోతు చిత్తరువును) పట్టి సత్యమైన గవయము తెలియుటకూడ సాదృశ్యమును (పోలికను) పట్టి వచ్చినదె- సాదృశ్యము సత్యమె.

౮౬. శబ్దముయొక్కటియే యయి ధ్వని విశేషములచేతను అర్థవిశేషముల జ్ఞానమునకు హేతువైనను అసత్యమును పట్టి సత్యము తెలియఁబడుట లేదు- అనేకధ్వనులచే నభివ్యక్తమగు నొకశబ్దమె ఆయాధ్వనిచేత అభివ్యంగ్యమగు స్వరూపమును బట్టి అర్థవిశేషములతోడి సంబంధమును గ్రహించుటవలన అర్థభేదముల జ్ఞానము పుట్టుటకు హేతువగును-

౮౭. శబ్దముయొక్కటియగుటయును యుక్తముకాదు- అర్థమును తెలియఁజేసెడి గకారము మొదలగునదియె చెవిచేత గ్రహింపఁబడును గాన అదియె శబ్దము- కాఁబట్టి అసత్యమైన శాస్త్రమునుబట్టి సత్యమైన బ్రహ్మమునుగూర్చిన జ్ఞానము కలుగననుట ఉపపాదింపశక్యము కానిది-

౮౮. శాస్త్రము ఆకాశపుష్పమువలె నసత్యము కాదు; అద్వైతజ్ఞానము కలుగకముందు సత్యమేయని తెలియఁబడును; తత్త్వజ్ఞానము కలిగినపైనిగదా శాస్త్రము అసత్యమగుట; అప్పుడు శాస్త్రము అన్నిభేదములులేని జ్ఞానమాత్రమైన బ్రహ్మము తెలియుటకు సాధనము కాదు; ఎప్పుడు సాధనమగునో అప్పుడు శాస్త్రముండనే యున్నది; కలదనియే కదా తెలియఁబడుచున్నది; అని యందురు- ఇది యుక్తము కాదు- శాస్త్రము లేనియప్పుడు శాస్త్రము కలదనియెడి జ్ఞానము అసత్యమే కదా- అయిననేమి యంటిరేని,- దినివలన నిదిలభించును- అసత్యమైన శాస్త్రమువలనఁ గలిగిన జ్ఞానము అసత్యముగాన, దానికి విషయమైన బ్రహ్మమునకుఁ గూడ అసత్యత్వము చ్చును- ఎట్లంటేని, పొగగా గ్రహింపఁబడిన ఆవిరివలనఁ గలిగిన అగ్ని జ్ఞానము అసత్యముగాన, ఆ జ్ఞానమునకు విషయమైన అగ్నికూడ నసత్యమె- తనకుఁ దరువాతను బాధ

కనఁబడకపోవుట.యనునది సిద్ధింపదు. శూన్యమె తత్త్వమనెడి వాక్యము చేతదానికిఁగూడ బాధకనఁబడుచునే యున్నది-అది భ్రాంతిమూలకమంటివేని,ఇదియును భ్రాంతిమూలకమని నీవెచెప్పితివి- తరువాత బాధలేకపోవుటకేమి,దానికై- ఇట్లు నిలువని కుయుక్తులను పరిహసించుట యింతతోఁజాలును-

౬౯. (ఛా॥౬॥౨॥౧॥) సదేవసోమ్యేదమగ్రఆసీత్ (ఈజగత్తు మొదటనుసత్తె అయియుండెను)అనునది మొదలగు వేదాంతవాక్యములు,విషయము లేమియు లేనిదియు జ్ఞానమొకటియెస్వరూపముగాఁగలదియునగు వస్తువును మాత్రమె తెలియఁజేయునవి, అనుటయును యుక్తముకాదు- ఒకటి తెలియుటచేత నన్నియును దెలియును అనెడి ప్రతిజ్ఞను ఉపపాదించెడితోఁ్రినను, సత్ అని చెప్పఁబడెడి పరబ్రహ్మము జగత్తునకు ఉపాదానముగుటయును నిమిత్తముగుటయును సర్వజ్ఞుఁడగుటయును సర్వశక్తులు కలవాఁడగుటయు సత్యసంకల్పుఁడగుటయు అన్నిటిలోను నుండుటయు అన్నిటికి నాధారమగుటయు అన్నిటినినియమించుటయుననునివి మొదలుగాఁగలఅనేకకల్యాణగుణములతోఁగూడియుండుటనును, జగత్తంతయును ఆతనికిఆత్మగాఁగలిగియుండుటనును తెలియఁజేసి, ఇట్టిబ్రహ్మము అన్నగాఁగలవాఁడవునీవు అగుచున్నావు అని శ్వేతకేతువునుగూర్చి ఉపదేశించుటకు ప్రవర్తించినది గదా యాప్రకరణము- ఈయంశము వేదార్థసంగ్రహమున విస్తరింపఁజేయఁబడినది- ఈగ్రంథమునఁగూడ ఆరంభణాధికరణమున (౨అ॥ ౧పా॥౧౫సూ॥)లెస్సగా నుపపాదింపఁబడును-

౭౦. (ము॥౧॥౧॥౫॥)అథపరాయయాతదక్షరమధిగమ్యతె(ఇఁకపరవిద్య, దేనిచేతఆయక్షరము తెలియఁబడునో)అనుచోటఁగూడ ప్రకృతిసంబంధులగు చెడుగుణములను నిషేధించినిత్యత్వము(కాలపరిచ్ఛేదము లేనిదగుట), విభుత్వము(దేశపరిచ్ఛేదము లేనిదగుట), సూక్ష్మత్వము సర్వగతత్వము (సూక్ష్మమైనదగుట, దీనిచేతనె అన్నిటిలోనుంజొచ్చియుండుట),అవ్యయత్వము(నాశము లేనిదగుట),భూతయోనిత్వము(సమస్తభూతములకును ఉపాదానకారణమగుట),సర్వజ్ఞత్వము (అన్నిటినెఱుంగువాఁడగుట), ఇవి మొదలగు కల్యాణగుణములు

లిగియుండుట పరబ్రహ్మమునకుఁ దెలియఁజేయఁబడినది-

౭౧- (తై॥ ౨॥ ౧॥ ౧॥) సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ (సత్యమైనదియు జ్ఞానస్వరూపమైనదియు అనంతమైనదియు బ్రహ్మము) అనుచోటఁగూడ, "సామానాధికరణ్యమనునది అనేక విశేషణములతోఁగూడిన యొక్క యర్థమును తెలియఁజేయును" అనెడి వ్యుత్పత్తిచేత నిర్విశేషవస్తువు సిద్ధించుటలేదు- ప్రవృత్తి నిమిత్తములు (శబ్దము ప్రవర్తించుటకు హేతువులైన యర్థములు) భిన్నములై ఒక్క యర్థమును చెప్పుటగదా సామానాధికరణ్యము (విశేషణవిశేష్యభావము)- అందు సత్యజ్ఞానాదిపదములకు ముఖ్యార్థములైన గుణములతోఁగాని ఆయాగుణములకు విరోధులగునాకారములకు విరోధులగునాకారములతోఁగాని ఒక్కవస్తువునందె పదములన్నియుఁ బ్రవర్తించుటలో నిమిత్తములు వేఱుగానుండుటను ముఖ్యముగానాశ్రయింపవలసినది- ఇంతమాత్రము విశేషముగలదు- ఒక్కపక్షమున పదములు ముఖ్యార్థములగును; రెండవపక్షమున వానికి లక్షణ (ముఖ్యముకాని యర్థమును చెప్పుట) వచ్చును- అజ్ఞానము మొదలగువానికి విరోధియగుట వస్తుస్వరూపము మాత్రమే యనవీలుగాదు- ఒక్కపదముచేతనే స్వరూపము తెలియఁబడినదిగాన మిగిలినపదములను ప్రయోగించుట నిరర్థకముకావలసివచ్చును- అట్లగుచుండఁగా సామానాధికరణ్యముగూడ సిద్ధింపదు- ఎందువల్లనంటేని ఒక్క వస్తువునందు ప్రవర్తింపుచున్న పదములకు నిమిత్తభేదము ఆశ్రయింపఁబడలేదు- అథ- మొక్కటియేయయి విశేషణములు భేదించుటచేత విశిష్టత్వము (విశేషణములతోఁగూడియుండుట) భేదించుటవలనఁగలిగిన యనేకార్థత్వము, పదముల సామానాధికరణ్యమునకు విరోధికాదు- ఒక్క వస్తువే అనేక విశేషణములతోఁగూడియుండుటను తెలియఁజేయునదియె సామానాధికరణ్యము- భిన్నప్రవృత్తినిమిత్తానాం శబ్దానామేకస్మిన్నర్థేవృత్తిస్సామానాధికరణ్యమ్ (ప్రవృత్తినిమిత్తములు భేదించియున్నశబ్దములు ఒక్క యర్థమునఁబ్రవర్తించుట సామానాధికరణ్యము) అని కదా వైయాకరణులు చెప్పుచున్నారు-

౭౨. (ఛా॥ ౬॥ ౨॥ ౧) ఏకమేవాద్వితీయమ్ (ఒక్కటియె- రెండవదిలేనిది) అనుచోట నద్వితీయపదము గుణముంబట్టికూడ రెండవది

యుండుటను సహింపదు; కాఁబట్టి సర్వశాఖాప్రత్యయన్యాయంబున కారణవాక్యంబులన్నియు అద్వితీయంబగు (రెండవదిలేని) వస్తువును ప్రతిపాదించుటను ఒప్పవలసినది; ఇట్లు కారణముగాఁ జెప్పఁబడిన అద్వితీయబ్రహ్మమునకు (తై॥౨॥౨॥౧) సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ అనిలక్షణము చెప్పఁబడుచున్నది; కాఁబట్టి లక్షణము చెప్పనుద్దేశింపఁబడిన బ్రహ్మము నిర్గుణమె; అట్లు కానిచో నిర్గుణంనిరంజనమ్ (గుణములులేనిది సంసారములేనిది) అనునీ మొదలగువానితో విరోధముగూడవచ్చును; అని చెప్పినదియు యుక్తము కాదు. అద్వితీయపదము జగత్తునకు ఉపాదానమగు బ్రహ్మమునకు తనకంటె మఱియొకఁ డధిష్ఠాత లేఁడని తెలియఁజేయుచు విచిత్రమైన శక్తి కలుగుటను ప్రతిపాదించును. అట్టి విచిత్రశక్తి కలుగుటను ప్రతిపాదించునదియె, (ఛా॥౬॥౨॥౩) తదైక్షతబహుస్యాం ప్రజాయేయేతి తత్తేజోఽసృజత (ఆ బ్రహ్మము నేనువిస్తారము కావలయును పుట్టవలయును అని సంకల్పించెను. అది తేజస్సును సృజించెను) అనునది మొదలగునది. విశేషమేమియును చెప్పక అద్వితీయమని చెప్పినంతమాత్రమున మఱియొక నిమిత్తముమాత్రము లేదనుటయని యెట్లు తెలియఁబడుచున్నదంటి రేని,—సృజింపఁగోరిన బ్రహ్మము ఉపాదానకారణమగుట (ఛా॥౬॥౨॥౧॥) సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవ అని తెలియఁజేయఁబడినది. కార్యము పుట్టునప్పుడెల్ల నిమిత్తముండుట స్వభావముగాన స్ఫురింపవలసినది మఱియొకఁడు నిమిత్తమే కాన అదియె అద్వితీయపదముచేత నిషేధింపఁబడుచున్నదని తెలియఁబడుచున్నది. అన్నిటిని నిషేధించునెడను మీచే నంగీకరింపఁబడినవై సాధింపనుద్దేశింపఁబడిన నిత్యత్వము మొదలగునవిగూడ నిషేధింపఁబడినవి కావలయును. సర్వశాఖాప్రత్యయన్యాయము ఇచ్చటమీకు విరుద్ధమైన ఫలమును కలుగఁజేయును. సర్వశాఖలయందును కారణముతో నన్వయించెడి సర్వజ్ఞత్వము మొదలగు గుణములను ఇచ్చట నుపసంహరించుటకు (చేర్చుటకు) హేతువగును. కాఁబట్టి కారణవాక్యము స్వభావమునుబట్టి (తై॥౨॥౧॥౧॥) సత్యంజ్ఞానమనన్తంబ్రహ్మ అనుదానిచేత విశేషములతోఁగూడిన వస్తువె ప్రతిపాదింపఁబడునని తెలియఁబడుచున్నది.

౭౩. నిర్గుణవాక్యములతో విరోధముగూడ లేదు-(          )
నిర్గుణం నిరఞ్జనమ్ (గుణములు లేనిదియు సంసారము లేనిదియు) (శ్వే౹౹౬౹౹౧౯౹౹)నిష్కళం నిష్క్రియం శాన్తమ్(అవయవములు లేనిదియు కదిలిక లేనిది... శాంతమైనదియు)ఇవి మొదలగు నిర్గుణశ్రుతులు ప్రాకృతిసం... ము లైన చెడుగుణములనుగూర్చినవి- జ్ఞానమాత్రమె స్వరూ... నెడి శ్రుతులుగూడ బ్రహ్మము జ్ఞానస్వరూపమని తెలియ... యుచున్నది- అంతమాత్రముచేత విశేషము లేవియు లేనిజ్ఞానవే... అర్థ్యముకాదు- తెలిసికొనువాఁడె జ్ఞానస్వరూపముగాఁగూడ నుండవచ్చును- జ్ఞానస్వరూపుఁడైనవానికె జ్ఞానముకలిగియుండుట,మణి, ద్యుమణి(సూర్యుడు), దీపము, మొదలగువానివలె యుక్తమెయని వెనుకఁజెప్పఁబడినది-

౭౪. అన్నిశ్రుతులును జ్ఞాతయగుటనె తెలియఁజేయుచున్నవిగదా-

(ము౹౹౧౹౹౧౹౹౧౦౹౹)యస్సర్వజ్ఞస్సర్వవిత్ (అన్నిస్వరూపములనెఱిఁగినవాఁడు అన్నిప్రకారములనెఱిఁగినవాఁడు)

(ఛా౹౹౬౹౹౨౹౹౩౹౹)తదైక్షత(ఆబ్రహ్మము తలంచెను)

(          )సేయందేవతైక్షత(ఆయీదేవత తలంచెను)

(ఐత౹౹౧౹౹౧౹౹) స ఈక్షత లోకాన్ను సృజా ఇతి(ఆతండు లోకములను సృజింపవలయునని తలంచెను)

(కఠ౹౹౫౹౹౧౩౹౹) నిత్యోనిత్యానాం చేతనశ్చేతనానామేకో బహూనాం యో విదధాతి కామాన్ (నిత్యుఁడును చేతనుఁడును అనఁగా తెలివిగలవాఁడును ఒకఁడునగునెవ్వఁడు నిత్యులును పెక్కండ్రునగు చేతనులు కోరువానిని కలుగఁజేయుచున్నాఁడో)

(శ్వే౹౹౧౹౹౯౹౹జ్ఞాజ్ఞౌ ద్వావజావీశనీశౌ (ఒకఁడు సర్వజ్ఞుఁడును మఱియొకఁడు అజ్ఞుఁడునైనవారును, ఒకఁడు ఈశ్వరుఁడును మఱియొకఁడు ఈశ్వరుఁడుగాని వాఁడునైనవారును అగు,ఇద్దఱును పుట్టుకలేనివారె)

(శ్వే౹౹౬౹౹౭౹౹)తమీశ్వరాణాం పరమం మహేశ్వరం త... నాం పరమంచ దైవతమ్। పతింపతీనాం పరమం పరస్తా...

వనేశమీడ్యమ్। నతస్యకార్యంకరణంచవిద్యతేనతత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే।పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతేస్వాభావికీజ్ఞానబలక్రియా చ। (ఈశ్వరులకు అనఁగా అధికారులకు మిక్కిలి గొప్పఈశ్వరుఁడై నవాఁడును, దేవతలకుగొప్పదేవతయయినవాఁడును, అధిపతులకుమిక్కిలి గొప్పయధిపతియైనవాఁడును, సమస్తలోకములకు నధిపతియయినవాఁడును, స్తోత్రముచేయఁదగినవాఁడునగు ఆదేవునిధ్యానముచేతుముగాత. ఆతనికిశరీరంబునులేదు. ఇంద్రియంబునులేదు. వానితోసమానుఁడైనవాఁడు కనఁబడఁడు. వానికంటె నధికుఁడునుకనఁబడఁడు. ఈతనికి గొప్పదియును అనేకవిధములైనదియునగుశక్తి చెప్పఁబడుచున్నది. స్వభావసిద్ధమగు జ్ఞానంబును బలంబును, పనియనఁగా నియమించుటయును గూడఁజెప్పఁబడుచున్నవి.)

(ఛా।౮।౧।౫।) ఏష ఆత్మాఽపహత పాప్మావిజరోవిమృత్యుర్విశోకోవిజిఘత్సోఽపిపాసస్సత్యకామస్సత్యసంకల్పః (ఈయాత్మపుణ్యపాపములులేనివాఁడును, ముదిమిలేనివాఁడును, మరణములేనివాఁడును, దుఃఖములులేనివాఁడును, ఆకలిలేనివాఁడును, దప్పికలేనివాఁడును, కోరవలసినవిఅన్నియుకలవాఁడును, అన్యథాలేని సంకల్పముకలవాఁడును.)

౭౫. ఇవిమొదలగుశ్రుతులు జ్ఞానస్వరూపుఁడగు బ్రహ్మమునకు స్వభావసిద్ధములైన జ్ఞాతృత్వము(తెలిసికొనువాఁడగుట)మొదలగుకల్యాణగుణములును హేయగుణములు(చెడుగుణములు)లేకపోవుటయును చెప్పుచున్నవి. అపహతపాప్మాఅనునది మొదలు అపిపాసః అనువఱకు హేయగుణములను నిషేధించి సత్యకామః సత్యసంకల్పఃఅని బ్రహ్మమునకు కల్యాణగుణములనువిధింపుచున్న(చెప్పుచున్న)ఈశ్రుతియె నిర్గుణవాక్యములయొక్కయును సగుణవాక్యములయొక్కయును విషయము [illegible] కాఁబట్టి సగుణనిర్గుణవాక్యములకు వి[illegible] [illegible] అనుకూలమైన యర్థముకలదని తెలి[illegible] [illegible] శక్తి [illegible]

[illegible] (శ్వే।[illegible]) [illegible] తే (ఈతనివలసిభయ [illegible] ఇది [illegible] బ్రహ్మగుణములను తెలు

# ప్రకటనము.

ఫెల్లో ఆఫ్ ది యూనివర్సిటీ, రాయబహాదర్, అను బిరుదములు గలిగిన మహారాజశ్రీ వల్లూరి జగన్నాథరావుపంతులుగారిచేత ఆంధ్రశారీరకమను పేర శ్రీమచ్ఛంకరభగవత్పాదవిరచితంబగు బ్రహ్మసూత్రభాష్యము తెనుగు చేయంబడి దానిలోని ప్రథమపాదము ముద్రింపింపఁబడినది.

దానిని దివాన్ రెబిల్ శ్రీ రాజా గోడె నారాయణగజపతిరాయనింగారు చిత్తగించి శ్రీభగవద్రామానుజాచార్యవిరచితంబగు శ్రీభాష్యమును గూడ తెనుఁగుగా రచియింపవలయునని సెలవిచ్చినందున ఈ యాంధ్రశ్రీభాష్యము రచింప నారంభింపఁబడినది.

ఇది జిజ్ఞాసువులందఱకు సులభించుటకై శ్రీరాజాగారి సెలవు ప్రకారమే ముద్రింపింపఁబడుచున్నది

ఇది నెల ౧కి ౨౪ పేజీలు గల సంచికలుగాఁ బ్రకటింపఁబడును.

| దీని చందా. | రు- అ పై- |
|---|---|
| ౬ మాసములకు పోస్టేజితో | ౧-౬-౦ |
| ౧ సంవత్సరమునకు, | ౨-౧౦-౦ |

విశాఖపట్టణము
ఆర్షముద్రాక్షరశాల

శ్రీపరవస్తు శ్రీనివాసజగన్నాథస్వామి
అయ్యవారలుగారు

ఈ యాంధ్రశ్రీభాష్యమునకు చందా నిచ్చినవారలు.

| మ-రా-రా-శ్రీ- | రు- అ పై |
|---|---|
| తాడివాడ వెంకటరామయ్యగారు | ౨-౧౦-౦ |
| కొమ్మిరెడ్డి శరభయ్యగారు | ౨-౧౦-౦ |